శ్రీమతే రామానుజాయ నమః



## సాంప్రదాయిక వ్యాస మాలిక - 2

# కాలక్షేపం,
# ఛాందోగ్యం–విశిష్టాద్వైతం,
# దివ్యప్రబంధ వైభవం,
# మణవాళమహామునుల నామవైభవం


**అనువాదకులు:**

పండితరత్న, ఉ.వే.శ్రీమాన్
ఈయుణ్ణి అళ్గహ శింగరాచార్య స్వామి వారు

**సంపాదకుడు:**

ఈయుణ్ణి అనంత రంగ రామన్

# నివేదన

వైదికమైన విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన పూర్వాచార్యులలో భగవద్రామానుజులు అగ్రగణ్యులు. వీరి తర్వాత ఎంతోమంది ఆచార్యులు ఈ సిద్ధాంతాన్ని తమ గ్రంథాలతో, ప్రవచనాలతో రక్షించి జిజ్ఞాసువులకు అందరికీ అందజేశారు. గత శతాబ్దిలో ఈ సిద్ధాంతాన్ని తమిళదేశంలో ప్రచారం చేసిన మహనీయులలో శ్రీమాన్ కార్ప్పం గాడు వేంకటాచార్యస్వామి, వేళుక్కుడి వరదాచార్య స్వామి, తిరుపతి టి. ఏ. కృష్ణమాచార్యస్వామి మొదలైనవారు ఎంతమందో ఉన్నారు. వీరు భగవద్రామానుజ సిద్ధాంతంలోని విశేషాలను తెలియజేస్తూ ఎన్నో వ్యాసాలను తమిళ భాషలో రచించారు. అయితే ఇవి కేవలం తమిళం తెలిసినవారికి మాత్రమే అందుబాటులో ఉన్నందున, వీటినిఆంధ్రీకరిస్తే ఆంధ్రదేశంలోని సంప్రదాయ జ్ఞాన పిపాసువులకు ఉపయుక్తంగా ఉంటుందని ప్రస్తుతం కొన్ని తమిళవ్యాసాలకు అనువాదాలను ఈ లఘు గ్రంథరూపంగా సంప్రదాయ పాఠకులకు అందివ్వడం జరుగుతున్నది. క్రమంగా ఈ విధంగానే మరికొన్ని తమిళవ్యాసాలకు అనువాదాలను చేసి సహృదయ పాఠకులకు అందజేయడం జరుగుతుంది.

**శ్రీమద్రామానుజగురోః**
**పాదయుగ్మే సమర్ప్యతే ।**
**వాచికీ పరిచర్యేయం**
**శ్రద్ధయా వ్యాసమాలికా ।।**

**- భవదీయుడు, ఈయుణ్ణి అళహ శింగరాచార్యులు**

# కాలక్షేపం

**(ఉ.వే.శ్రీమాన్. కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామి వారి ద్రావిడ వ్యాసం ఆధారంగా)**

కాలక్షేపం అనే పదం లోకంలో సామాన్యంగా వ్యవహారంలో ఉండే పదం. దీనికి కాలాన్ని గడపడం–అని అర్థం. ఇది సంస్కృత పదం. దీనికి తమిళ భాషలో "పోదు పోక్కు" అనేది పర్యాయపదం. శ్రీ భాష్య గ్రంథాన్ని అధ్యయనం చేసినా, భగవద్ విషయ గ్రంథాన్ని (తిరువాయ్ మొழி అనే నమ్మాళ్వార్ల ప్రబంధానికి వ్యాఖ్యానం) అధ్యయనం చేసినా, శ్రీ భాష్య కాలక్షేపం జరుగుతున్నది అని, భగవద్విషయ కాలక్షేపం జరుగుతున్నదని అనడం సంప్రదాయంలో పరిపాటి. కాలక్షేప శబ్దానికి ఈ విధంగా "అధ్యయనం చేయడం" అనే అర్థాన్ని చెప్పడం ఏ విధంగా కుదురుతుంది? ఈ ప్రయోగం ఏ విధంగా సమన్వయిస్తుంది? అని కొందరు అభిప్రాయపడవచ్చు. శ్రీ భాష్యం కాలక్షేపం అంటే–శ్రీభాష్యగ్రంథంతో కాలక్షేపం చేయడం–అని అర్థం. శ్రీరామాయణ కాలక్షేపం, శ్రీ వచన భూషణం కాలక్షేపం మొదలైన వ్యవహారాలన్నిటికీ ఇదే అర్థం. ఈ విధంగా ఈ పదాన్ని వ్యవహరించే పెద్దల అభిప్రాయం ఏమి? అని అంటే-ఆ గ్రంథాలను చదివి, వాటిలోని అర్థాలను మనం తెలుసుకుంటున్నామో లేదో.. ఆ విషయాన్ని పక్కన పెట్టండి... చక్కని రీతిలో కాలాన్ని గడిపితే చాలు-అనేదే ఇక్కడ వారి అభిప్రాయం.

ఆర్తి ప్రబంధం అనే ప్రబంధంలో శ్రీ వరవరమునులు "మున్నవరామ్ నమ్ గురవర్ మొழிకళుళ్ళప్పెట్రోమ్, ముழு దు నమక్కవై పొழுదు పోక్కాకప్పెట్రోమ్" (మన పూర్వాచార్యుల శ్రీసూక్తులను మనసులో భావించగలిగాము. వాటితో పూర్తిగా

కాలాన్ని గడపగలిగాము) అని పలికిన రీతిలో పెద్దల సూక్తులతో కాలక్షేపాన్ని చేయడం జన్మాంతర సహస్ర తపఃఫలం. "కావ్య శాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతామ్, అన్యేషాం తు మనుష్యాణాం విద్యయా కలహేన వా" (కావ్యాలను అధ్యయనం చేయడంద్వారా, శాస్త్రాలను అధ్యయనం చేయడం ద్వారా కాలాన్ని గడపడం అనేది పెద్దల అలవాటు. మిగిలిన వారైతే నిద్రతోనో, లేక ఇతరులతో కలహించడంతోనో కాలాన్ని గడుపుతారు) అని శ్లోకం ఒకటి అందరికీ తెలిసినదే.

లోకంలో ఉండేవారు ఏ విధంగా తమ కాలాన్ని గడుపుతున్నారు? అనే విషయాన్ని మనం గమనిస్తే, ఉద్యోగాలు చేసేవారు, వ్యాపారం చేసేవారు, వ్యవసాయం చేసేవారు మొదలైనవారి కాలక్షేపం వారి వారి ప్రవృత్తులనుబట్టి ఉంటుంది. ఇక, కొందరు దేశంలోని వృత్తాంతాలను వార్తా పత్రికల ద్వారా చదివి తెలుసుకోవడం, నవలలను చదవడం, చదరంగం ఆడడం మొదలైన కార్యాలతో కాలాన్ని గడపుతారు. ఇంకా కొంతమంది అయితే. ఒకటిగా చేరి, ఇతరులను గూర్చిన అక్కరలేని చర్చలను చేస్తూ, ఆ విధంగా తమతో కలవనివారిని గురించి, సత్కాలక్షేపం చేసే పెద్దలను గురించి వ్యతిరేకంగా మాట్లాడుతూ, వారిపై చాడీలు చెబుతూ, పది గంటల కాలాన్ని పది నిమిషాలుగా గడుపుతారు. ఇటువంటి వారు చిన్న ఊరు నుండి పెద్ద పట్టణం వరకు అంతటా కనిపిస్తారు. వారు పొందే ఆనందం ఏమిటో మనకు తెలుసు. అయితే, మనం మన కాలక్షేపం ద్వారా పొందే ఆనందం విలక్షణమైనది. విలక్షణమైన రీతిలో లభించేది. దీనిని గురించి ఆళ్వారులు తెలిపిన రీతిలో గమనిద్దాం.

కాలక్షేపాన్నిగూర్చి ఇద్దరు ఆళ్వారులు తమ ప్రబంధాలలో ప్రస్తావన చేశారు. తిరుమழிశై ఆళ్వార్లు (భక్తిసారులు) నాన్ముకన్ తిరువందాది అనే ప్రబంధంలో(63)

"తెరిత్తెழுది వాశిత్తుమ్ క్కేట్టుమ్ వళఙ్గి వழிపట్టుమ్ పూశిత్తుమ్ పోక్కినేన్ పోదు" (ఆదిశేషునకు అంతరాత్మవు అయిన నిన్ను గురించి అనుసంధించి, వ్రాసి, చదివి, విని, నమస్కరించి, వీటినే జీవనయాత్రగా కలిగి, నీ ఆరాధన చేసి, కాలాన్ని గడపుతూ ప్రాణాన్ని ధరించి ఉన్నాను) అని అన్నారు. ఈ పాశురాన్ని మనం నిత్యం స్మరించుకోవాలి. కాలాన్ని గడిపే విధానాన్ని వీరివలె వివరించి తెలిపినవారు మరొకరు లేరనే చెప్పాలి. భగవంతుని గురించి తెలుసుకోవడం, ఆ స్వామిని గురించి రాయడం, చదవడం, వినడం, నమస్కరించడం, కైంకర్యం చేయడం–అనే వీటితోనే తాము కాలాన్ని గడుపుతున్నట్లు, ఇవి లేకపోతే తాము ప్రాణాలను ధరించి ఉండడం సాధ్యం కాకుండా ఉన్నట్లు వీరు తెలిపిన విషయం పై సూక్తులలో స్పష్టం అవుతున్నది.

నమ్మాళ్వార్లు ఇంతకంటే విలక్షణమైన రీతిలో ఒక సూక్తిని పలికారు. పెరియ తిరువందాది అనే తమ ప్రబంధంలో చివరిలో 86వ పాశురంలో "కార్ కలన్ద మేనియాన్ కైకలన్ద వాழிయాన్ పార్ కలన్ద వల్ వయిర్రాన్ పామ్బణైయాన్ శీర్ కలన్ద శొల్ నినైన్దు పోక్కారేల్ శూழ் వినైయినాళ్ తుయరై ఎన్నినైన్దు పోక్కువరిప్పోదు?" (మేఘంతో సాటి వచ్చే రూపాన్ని, చేతిలో సుదర్శనాన్నికలవాడు, భూమిని అంతటినీ పెట్టుకున్న బలమైన ఉదరాన్ని కలవాడు, ఆదిశేషునిపై పరుండి ఉండేవాడైన భగవంతుని కళ్యాణగుణాలతో కూడిన సూక్తులను భావిస్తూ కాలం గడపక పోతే అనాదిగా ఉండే పాపాల వల్ల కలిగిన దుఃఖాలను ఇపుడు ఇక ఏ విధంగా పోగొట్టుకుంటారు?) అని చాలా చమత్కారంగా, మనోహరంగా పలికిన ఈ పాశురం స్మరించదగినది.

ఈ సూక్తిలోని భావాన్ని కొంచెం వివరంగా గమనిద్దాం. భగవానుని కల్యాణ గుణాలతో నిండిన సూక్తులను అనుసంధిస్తే -

పాపాలు, వాటివల్ల కలిగిన దుఖాలన్నీ తీరిపోతాయి–అని కొందరు పెద్దలు భావించడం, ఆ విధంగానే పలకడం లోకంలో ఉన్నదికదా! అయితే మరి, అళ్వార్లు ఇక్కడ కొత్తగా ఏమి పలుకుతున్నారు? అంటే, –"పాపాలు, వాటివల్ల కలిగిన దుఖాలు తీరితే తీరనీ, లేక, ఇంకా పెరిగినా పెరగనీ. దానిని గూర్చి నాకేమి చింత? ఈ లోకంలో మనం బ్రతికినంతవరకు కాలాన్ని గడపాలి కదా! కాలాన్ని ఏ విధంగా గడపడం? భగవంతుని గుణాలతో మధురంగా ఉండే సూక్తులతోనే కదా కాలాన్ని గడపాలి. కాలాన్ని వేరు ఏవిధంగా గడపడానికి సాధ్యమవుతుంది? లోకంలో ప్రతి ఒక్కడు తన తన జీవిత కాలాన్ని గడిపే తీరాలి. భగవంతుని గుణాల అనుభవంతో తప్ప, ఇక వేరే ఏ రీతిలో కాలం గడుస్తుంది? మనకైతే ఇంకొక విధంగా కాలాన్ని గడపడం కష్టం కదా" అని అంటూ ఇక్కడ ఈ సూక్తిలో ఆళ్వార్లు పలికిన అర్థం ఎంత హృద్యమైనది! ఎంతటి రుచికరమైనది! ఇటువంటి మానసికమైన నిశ్చయం ప్రతి ఒక్కరికి కలగాలి కదా! కలిగితే అంతకంటే అదృష్టం ఇంకొకటి ఏముంటుంది!

పైన ప్రస్తావించిన నమ్మాళ్వార్ సూక్తిలో స్ఫురించే ఒక చక్కని రస్యమైన అర్థాన్ని కూడా పెద్దలు వివరించారు. "కార్ కలన్ద మేనియాన్" ఆంటే మేఘంతో సాటి వచ్చే రూపాన్ని కల శ్రీరాముడు. "కార్ కలన్ద మేనియాన్ శీర్ కలన్ద శొల్" (అతని గుణాలు నిండిన సూక్తులు) ఆంటే శ్రీరామాయణం. "కైకలన్ద ఆళియాన్" అంటే చేతిలో చక్రాన్ని కల శ్రీకృష్ణుడు. ఆ అవతారంలో నరకాసురవధ, బాణాసుర వధ, మహాభారత యుద్ధం మొదలైన పలు సందర్భాలలో కృష్ణుడు సుదర్శనాన్ని ధరించడం ప్రసిద్ధం. అందువల్ల "కైకలన్ద ఆళియాన్ శీర్ కలన్ద శొల్" అంటే మహాభారతం. "వల్ వయిఱ్ఱాన్ " అంటే ఉదరంలో లోకాలను ధరించిన బొజ్జను కల వటపత్రశాయి. అతని గుణాలు నిండిన సూక్తులంటే శ్రీభాగవతం. మొదలైన పురాణాలు. ఆ

పురాణాలలో పలు చోట్ల వటదళశాయికథ ప్రస్తుతంకదా! ఇక, చివరిగా “పామ్బణైయాన్" అంటే – ఆదిశేష శయనుడైన శ్రీరంగనాథుడు. ఆస్వామి గుణాలతో నిండిన సూక్తులంటే అంగి ప్రబంధమైన తిరువాయ్ మొழி ప్రబంధం. దానికి అంగాలైన మిగిలిన ఆళ్వారుల ప్రబంధాలు. తిరువాయ్ మొழி మొత్తం శ్రీరంగనాథుని స్తుతిలో పర్యవసిస్తుంది అనే రస్యార్థాన్ని భట్టర్ ఆ ప్రబంధానికి తాము రచించిన "వాన్ తికழும் శోలై" అనే తనియన్ పాశురంలో స్పష్టంగా పలకడం గమనించాలి. ఈ విధంగా ఉభయ వేదాంతాల అనుసంధానాన్ని, కాలక్షేపంలో శ్రీసూక్తుల ప్రాధాన్యాన్ని నమ్మాళ్వారుల ఈ సూక్తి సూచిస్తుంది–అని తెలుస్తున్నది.

# ఛాందోగ్యం–విశిష్టాద్వైతం

**(న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్య స్వామివారి తమిళ వ్యాసం ఆధారంగా)**

ధర్మార్థ కామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలలో మోక్షమనేది చాలా గొప్ప పురుషార్థం. విశిష్టాద్వైతులు అనబడే శ్రీవైష్ణవులు శ్రీమన్నారాయణుని దరి చేరి, ఆ స్వామిని సేవించి, ఆ స్వామికి సంతోషాన్ని కలిగించే సేవ చేయడమే మోక్ష పురుషార్థమని భావిస్తారు. అటువంటి మోక్షప్రాప్తిని, దానిని పొందడానికి తగిన సాధనాన్ని వివరించడంకోసం అవతరించినవి, చాలా గొప్పవి అయిన శాస్త్రాలే ఉపనిషత్తులు. ఈ ఉపనిషత్తులలో సామవేదానికి చెందిన ఉపనిషత్తు చాందోగ్యం. ఆ చాందోగ్యంలోని కొన్ని సూక్తులను ఆధారంగా చేసుకుని, భగవద్రామానుజులు శ్రీ భాష్యం మొదలైన గ్రంథాలలో వాటికి తెలిపిన అర్థాలను పురస్కరించుకుని, ఆ ఉపనిషత్తులో తెలుపబడిన విశిష్టాద్వైత తత్త్వాన్ని సంగ్రహంగా గమనిద్దాం.

విశిష్టాద్వైతం అనే పదానికి "విశిష్టస్య అద్వైతం విశిష్టాద్వైతమ్" అనే విగ్రహవాక్యాన్ని పెద్దలు తెలుపుతారు. చేతనాచేతనాలను శరీరంగా కల వస్తువుయొక్క అద్వైతమే విశిష్టాద్వైతం.అంటే– చేతనాచేతనాలను తనకు శరీరంగా కలిగిన వస్తువు భగవంతుని కంటే ఇంకొకటి లేదు–అని అర్థం.

దీనిని లోతుగా గమనిస్తే, "యస్య పృథివీ శరీరమ్", "ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" మొదలయిన వేదవాక్యాలు దీనిని తెలుపుతున్నాయి. బ్రహ్మం ఆత్మ, ప్రపంచం శరీరం, ఆత్మ అయిన ఆ బ్రహ్మం నారాయణుడే" అనే విషయం ఇక్కడ చక్కగా తెలుస్తుంది.

ఏ వస్తువు నియమించదగినదై, ధరించదగినదై, అతిశయాన్ని కలిగించేదై ఉంటుందో అది శరీరం అనబడుతుంది. ఏ వస్తువు శరీరాన్నినియమించగలిగినదై, ధరించగలిగినదై, ఆ శరీరం చేసే పనిని స్వీకరించగలిగి, దానివల్ల ఆనందాన్ని పొందగలిగినదై ఉంటుందో, ఆ వస్తువు ఆత్మ – అని క్రమంగా శరీర లక్షణం, ఆత్మ లక్షణం తెలుపబడ్డాయి. జీవుడు చేతులు, కాళ్ళు మొదలైన అంగాలతో కూడిన పిండాన్ని (శరీరాన్ని ) ధరించి, దానిని ప్రేరేపించి, ఆ పిండం చేసే పనిని స్వీకరించి ఆనందిస్తున్నాడు కనుక, అతనిని ఆత్మ అని, ఆ పిండాన్ని శరీరమని ఏ విధంగా తెలిసికుంటున్నామో - ఆ విధంగానే పరమాత్మ కూడా చేతనాచేతనరూపమైన ఈ ప్రపంచాన్ని ప్రేరేపించి, నియమించి, ధరించి, ఈ ప్రపంచం చేసే పనిని స్వీకరించి ఆనందిస్తున్నాడు. కనుక ఆ స్వామిని ఆత్మ అని, ఈ ప్రపంచాన్ని శరీరమని తెలిసికొనవచ్చుకదా.

ఈ విధంగా చెప్పినందువల్ల విశిష్టాద్వైత శబ్దార్థాన్ని, ప్రపంచం – బ్రహ్మం అనే వీటి మధ్య ఉన్న శరీరాత్మభావాన్ని ఒక విధంగా తెలుసుకున్నాము. ఇక, విశిష్టాద్వైతానికి సంబంధించిన ముఖ్యమైన ఈ విషయాలను చాందోగ్యంలోని కొన్ని సూక్తులలో గమనిద్దాం.

'శ్వేతకేతూపాఖ్యానం' చాందోగ్యోపనిషత్తులోని ఆఱవ ప్రపాఠకంలో మొదట చెప్పబడింది. ఆ ఉపాఖ్యానం ఈ క్రింది విధంగా ఉన్నది: ఒకానొక సమయంలో ఉద్దాలకుడు అనే ముని తన కుమారుడైన శ్వేతకేతువును చూచి, "నీవు ఒక ఆచార్యుని ఆశ్రయించి బ్రహ్మచర్యంద్వారా వేదాలను అధ్యయనం చేయి" అని అన్నాడు. పన్నెండేళ్ళవయస్సు ఉండే ఆ శ్వేతకేతువు ఆ

విధంగానే గురుకులవాసాన్ని పన్నెండేళ్ళ పాటు చేసి, వేదాలను అన్నిటిని అధ్యయనం చేసి, తన ఇంటికి వచ్చి చేరాడు. ఇంత అధ్యయనం చేసినా తన కుమారుడు వినయం లేకుండా ఉండడాన్ని తండ్రి ఉద్దాలకుడు గమనించాడు. అతని అవినయానికి హేతువు అతనికి బ్రహ్మజ్ఞానం లేకపోవడమే – అని తెలిసికొన్నాడు. ఉద్దాలకుడు 'కుండ, మట్టి, కుమ్మరివలె ఈ ప్రపంచానికి నిమిత్తకారణం, ఉపాదానకారణం బ్రహ్మమే' అనే విషయాన్ని తెలిసిన మహాజ్ఞాని. అటువంటి ఉద్దాలకుడు తన కుమారుడు కూడా బ్రహ్మజ్ఞానాన్ని పొందాలని తలచి, అతనితో "ఉత తమాదేశమప్రాక్ష్యః? "(ఆదేశశబ్దంచేత చెప్పబడే ఆ పరమాత్మను దర్శించావా?) అని ప్రశ్నించాడు. ఈ వాక్యంతో పాటు "యేనాశ్రుతం శ్రుతం భవతి అమతం మతమ్ అవిజ్ఞాతమితి" అనే వాక్యం సంబంధించి ఉన్నది. ఏ వస్తువు గురించి విన్నట్లయితే అన్ని వస్తువులనుగూర్చి విన్నట్లు అవుతుందో, ఆ ఆదేశాన్ని (అన్ని వస్తువులను నియమించేవాడైన ఆ పరమాత్మను) గూర్చి నీవు ఆచార్యుని వద్ద ప్రశ్నించి తెలిసికొన్నావా? అనేది ఈ ప్రశ్నలోని తాత్పర్యం. ఇందులోని భావాన్ని తెలియలేని శ్వేతకేతువు "ఒక వస్తువునుగూర్చి తెలుసుకుంటే ఇంకొకదానిని గూర్చి ఏ విధంగా తెలిసినట్లు అవుతుంది?" అనే భావంతో "దీనిని మీరే వివరించి చెప్పండి" అని ప్రార్థించాడు. అపుడు ఉద్దాలకుడు ఈ విషయాన్ని కొన్ని ఉదాహరణలతో మొదట వివరించి తెలిపాడు.

ఏ విధంగా మట్టిని గరించి తెలుసుకుంటే ఆమట్టినుండి పుట్టే కుండ మొదలైన కార్యాలన్నీ తెలియబడినవి అవుతున్నాయో, ఏ విధంగా బంగారు ముద్ద, ఇనుపగుండు– అనే వీటిని తెలిసికొంటే వాటినుండి పుట్టే కార్యాలన్నీ తెలియబడినవి అవుతాయో, ఆ విధంగానే బ్రహ్మను గురించి తెలిసికొంటే ఆ బ్రహ్మకార్యమైన ఈ ప్రపంచం తెలియబడినది అవుతుంది– అని

అన్నాడు. ఈ మాటలను విన్న శ్వేతకేతువు “మళ్లీ తనను తండ్రి గురుకులవాసానికి పంపిస్తా డేమో!" అని భయపడి, "నా ఆచార్యులు ఈ విషయాన్ని తెలియరు. దీనిని తెలిసినవారైతే, గుణశాలి అయిన నాకు ఉపదేశం చేసి ఉండేవారు. అందువల్ల మీరే కృపతో నాకు ఈ విషయాన్ని ఉపదేశం చేయాలి" అని ప్రార్థించాడు.

అపుడు తండ్రి అయిన ఉద్దాలకుడు ప్రేమతో తన పుత్రునకు ఈ విధంగా బ్రహ్మతత్త్వాన్నిగూర్చి ఉపదేశం చేశాడు. "సదేవ సౌమ్య ఇద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనేది ఉద్దాలకుడు శ్వేతకేతువునకు చేసిన ఉప దేశంలోని మొదటి వాక్యం. "తత్త్వమసి శ్వేతకేతో!" అనేది చివరి వాక్యం. ఈ రెండు వాక్యాల భావాన్ని క్రమంగా ఇక్కడ గమనిద్దాం.

మొదటి వాక్యంలోని అర్థం ఏమంటే – బ్రహ్మం చాలా ఉన్నతమైన తత్వం. ఈ బ్రహ్మంవలెనే, దీనితో పోలిన చేతన వస్తువులు, దీనితో పోలిక లేని అచేతన వస్తువులు, జ్ఞానం, శక్తి మొదలైన కళ్యాణ గుణాలు – అన్నీ యథార్థాలు. కనుక, ఈ బ్రహ్మం సవిశేషమైనది. చేతనాచేతన వస్తువులతో కూడినది. దీనిని "సదేవ" అనే వాక్యంలో మనం చక్కగా, స్పష్టంగా గమనించవచ్చు. ఈ శ్రుతిలో ఉండే "అగ్రే" అనే పదం సృష్టికి పూర్వం ఉన్న కాలాన్ని సూచిస్తుంది. కాలం అనేది అచేతనం కనుక జ్ఞానశూన్యమైనది. పరమాత్మ గొప్ప జ్ఞానాన్ని కలవాడు. అందువల్ల కాలం బ్రహ్మంకంటే విలక్షణమైన వస్తువు– అనేది మనం తెలిసికొనే విషయమే .ఇక్కడ సృష్టికి ముందు తనతో సాటి రాని వస్తువు అయిన కాలం, బ్రహ్మం రెండు ఉన్నాయని తెలుస్తున్నదికదా. బ్రహ్మంతో పోలిన వస్తువు లేదు– అనే విషయమే నిజమైతే, "అగ్రే" అని అనడం పొసగుతుందా? అర్థాన్ని కలిగినది అవుతుందా? ఇందువల్ల, సృష్టికి ముందు బ్రహ్మంకంటే

విలక్షణమైన వస్తువు ఉన్నది – అనేది తెలుస్తున్నది. ఈ వాక్యంలో ఉండే "ఏకమ్" అనేది కూడా బ్రహ్మంయొక్క సూక్ష్మదశను తెలుపుతుంది. నామరూపాలు లేని దశయే సూక్ష్మదశ. నామాన్ని, రూపాన్ని కలిగిన దశ స్థూలదశ అనబడుతుంది. సృష్టికాలంలో ఒక్కొక్క వస్తువు వేరు వేరుగా నామరూపాలు పొందినవిగా మనం చూస్తున్నాం. ఉపనిషత్తులు సృష్టినిగూర్చి తెలిపేటప్పుడు భగవంతుడు "బహు స్యాం ప్రజాయేయ" అని సంకల్పాన్ని చేసి, ఆ విధంగా అతడు బహువిధాలుగా అయినట్లు తెలుపుతున్నది. ఈ వాక్యంలో ఉండే "బహు స్యామ్" అనే పదం గమనించదగినది.

ఇంతేకాక, "ఒక వస్తువును గురించి తెలిసికొంటే అన్ని తెలిసినట్లు అవుతుంది"("ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్) అనే విషయాన్ని తండ్రి ఉపదేశించే సందర్భంలో ఉండే "ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్" (ఒక మట్టి ముద్దను గురించి తెలుసుకుంటే ఆ మట్టిముద్దనుండి పుట్టే అన్నీ తెలిసినట్లు అవుతాయి) అనే వాక్యంకూడా ఇక్కడ తప్పక అనుసంధించదగినది.

మట్టి, కుండ, చట్టి మొదలుగా అనేక రీతులలో పేర్లను, రూపాలను కలిగి ఉండేటప్పుడు మట్టిముద్ద పలు వస్తువులుగా ఉన్నందున "సర్వమ్" అని, ఆ విధంగా పలు పేర్లను, రూపాలను లేకుండా ఉండేటప్పుడు "ఏకేన మృత్పిండేన" అని ఈ శ్రుతి పల్కినందున పైన ప్రస్తావించిన విషయం చక్కగా వ్యక్తమవుతున్నది కదా. వీటివల్ల ఇక్కడ ఉండే "ఏకమ్" అనే శబ్దం పేర్లు, రూపాలు లేకుండా ఉండే సూక్ష్మదశను కలిగిన కారణవస్తువును తెలుపుతున్నది – అనే దానిని గమనించాము.

ఇక్కడ ఉండే "ఏవ" అనే పదం వైశేషికులు నిత్యమని పలికే ఆకాశం మొదలైన వస్తువులు కూడా ప్రళయంలో లయాన్ని పొందుతున్నాయి – అనే విషయాన్ని తెలుపుతున్నది. ఈ విధమైన ఏకశబ్దానికి ఉండే అర్థాన్ని మనం మనసులో పెట్టుకుని నిశితంగా గమనిస్తే, సృష్టికి ముందు బ్రహ్మం నామరూపాలు లేకుండా ఉండే సూక్ష్మజగత్తుతో కూడి ఉన్నది – అనే విషయం అందరికీ చక్కగా తెలుస్తుంది.

ఇంతేకాక, జీవుడు నిత్యుడు – అనే దానిని వైదికులు అందరూ ముఖ్యంగా ఒప్పుకునే ఒక తత్వం. దీనివల్ల సృష్టికి ముందు జీవుడు ఉన్నాడు– అనేది తెలుస్తున్నది. జీవుడు జ్ఞానాన్ని కలవాడు, పరమాత్మ జ్ఞానాన్ని కలవాడు. అందువల్ల ఈ పరమాత్మ జీవునితో పోలినవాడు. ఇందువల్ల బ్రహ్మంతో పోలిన వస్తువు ఉన్నది – అనే విషయాన్ని మనం చక్కగా తెలియవచ్చు.

అంతేకాక వ్యాసులు శారీరకమీమాంసాశాస్త్రంలో "జీవాత్మలు ఎల్లప్పుడూ ఉన్నారు. ప్రళయకాలంలో కూడా వారికి, వారి కర్మలకు నాశం లేదు. భగవంతుడు సృష్టిసమయంలో మొదట వారి వారి కర్మలను అనుసరించి విచిత్రమైన సృష్టిని చేస్తున్నాడు కనుక అతనికి వైషమ్యం, పక్షపాతం మొదలైన దోషాలు ఉన్నాయని పలికే అవకాశం లేదు " అనే విషయాన్ని స్పష్టంగా తెలియజేశారు. "వైషమ్యనైర్ఘృణ్యే న, సాపేక్షత్వాత్", "న కర్మవిభాగాదితి చేన్న" అనే సూత్రాలలో ఈ విషయాన్ని గమనించవచ్చు. దీనివల్ల కూడా పైన తెలిపిన విషయం, అంటే, బ్రహ్మాన్ని పోలిన వస్తువు, అంటే, ఆత్మలు ఉన్నారు – అనే విషయం రూఢి అవుతుంది.

ఇక, "అద్వితీయమ్" అనే పదంలోని అర్థాన్ని చూద్దాం. ఈ పదం "కుండకు కుమ్మరివానివలె, ఈ జగత్తుకు బ్రహ్మమే

నిమిత్త కారణం, ఇంకొకరు నిమిత్త కారణం కాదు" అనే అర్థాన్ని తెలుపుతున్నది. ఏ విధంగా అంటే – ఏకశబ్దంలోని అర్థాన్ని గమనించినప్పుడు కుండ చట్టి మొదలైన పలు పలు కార్యవస్తువులకు మన్ను కారణం అయినట్లే, ఈ జగత్తుకు నామరూపాలు లేకుండా ఉండే సూక్ష్మజగత్తుతో కూడిన బ్రహ్మమే కారణం – అనే విషయం ఒక విధంగా ఇంతకు ముందు తెలుపబడింది కదా. ఆ అర్థాన్ని తెలిసినవారికి ఈ ప్రపంచానికి నిమిత్త కారణం ఏది? అనే సందేహం కలగడం సహజమే. ఈ సందేహం తీరేటట్లు ఇక్కడ అ అద్వితీయపదానికి "భగవంతుడు విచిత్రమైన శక్తిని కలిగినవాడు కనుక, ఉపాదానకారణం అయినట్లు అతడే నిమిత్త కారణం అవుతున్నాడు,ఇంకొకరు కాదు" అనే అర్థాన్ని గ్రహించడం చాలా యుక్తంకదా

ఇక "సదేవ" అనే పదంలోని అర్థాన్ని గమనిద్దాం. ఇక్కడ "సదేవ" అనే పదం ఆసత్కార్యవాదాన్ని నిరసిస్తున్నది – అని అంటారు. దీనిని వివరిస్తాను. కుమ్మరివాడు మట్టిని, నీటిని కలిపి పిసికి మట్టి ముద్దగా చేసి, దానిని కుండగా చేయడం లోకంలో చూస్తున్నాము. ఇక్కడ కుండ కార్యం, మన్ను కారణం. కార్యవస్తువైనా కుండ నోరు, కడుపుతో కూడిన రూపాన్ని కల మన్నే తప్ప, వేరు వస్తువు కాదు, ఈ కార్యవస్తువు పుట్టడానికి ముందు ఈ విధంగా నోరు, కడుపు కలిగిన దశ లేకపోయినా, మట్టిముద్ద అనే స్థితితో ఉండే మన్నే–అనే విషయం మనకు తెలిసినదే. దీనివల్ల ఒక దశతో ముందు ఉండే వస్తువే తరువాత వేరొక వస్తువుగా అవుతున్నది, వేరొక దశ పొందుతున్నది తప్ప ముందు లేనిది ఏదీ తర్వాత కొత్తగా పుట్టబోదు – అనే విషయం చక్కగా ఇక్కడ వ్యక్తమవుతున్నది కదా .

ఈ విషయాన్ని మనసులో పెట్టుకొని ఇక్కడ "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్" అనే వాక్యాన్ని గమనిస్తే వాస్తవార్థం

వ్యక్తమవుతుంది. "సృష్టికి ముందు ఈ ప్రపంచం 'సత్' అనే వస్తువుగా ఉన్నది" అనేది దీని అర్థం. ఈ అర్థాన్ని గమనించినప్పుడు ముందు లేనిది తర్వాత పుడుతున్నది అనే అసత్కార్యవాదానికి ఏమాత్రం అవకాశం లేదు – అనేది చక్కగా తెలుస్తుంది.

ఇక్కడ 'సత్' అనే పదం ప్రమాణ సంబంధానికి యోగ్యతను కల వస్తువును తెలుపుతుంది – అనే విషయాన్ని గమనిస్తే, కారణత్వానికి జగత్కారణమై ఉండడానికి అపేక్షితమైన జ్ఞానం, శక్తి మొదలైన గుణాలను కల బ్రహ్మాన్ని ఇది సూచిస్తుంది – అనే విషయం స్పష్టమవుతుంది. కుమ్మరివాడు మట్టిని కుండగా చేయడానికి తగిన జ్ఞానం, సామర్థ్యం కలవాడు కదా. ఆ కుమ్మరివానివలె పరమాత్మకూడా ప్రపంచాన్ని నిర్మించేటపుడు దానికి ఆవశ్యకమైన జ్ఞానాన్ని, శక్తిని కలిగి ఉండాలి" అనే విషయం చెప్పకుండానే తెలుస్తుంది.

"సదేవ" అనే మొదటి వాక్యంలోని అర్థాన్ని ఇంతవరకు కొంచెం వివరంగా గమనించాము. దీనిని సంగ్రహంగా తెలిపితే –"నాయనా! చూడు. ఈ ప్రపంచం సృష్టికాలానికి ముందు సత్ అనే వస్తువుగానే ఉన్నది. నామ రూపాలు లేకుండా ఉండే సూక్ష్మదశను కల వస్తువుగానే ఉన్నది. ఈ జగత్తుకు ఆ వస్తువే నిమిత్తకారణం, వేరొకటి కాదు" – అని చెప్పవచ్చు. ఇక్కడ సత్ అని చెప్పబడే వస్తువు బ్రహ్మం. అది చాలా ఉన్నతమైన వస్తువు. జ్ఞానం,శక్తి మొదలైన గుణాలతో కూడినది. దానితో పోలిన వస్తువైన ఆత్మలున్నారు. విలక్షణమైన వస్తువు అయిన అచేతనం కూడా ఉన్నది. ఈ విధంగా సత్ అనే వస్తువు విశిష్టంగా, అంటే, గుణాలతో, చేతనా చేతనాలతో కూడినదై ఉన్నదని తెలుస్తున్నది –అనేది మనం ఇక్కడ సారమైన అర్థంగా గమనించాలి.

ఇక తత్త్వమసి చివరి వాక్యం లోని అర్థాన్ని గమనిద్దాం. ఈ వాక్యంలో "తత్" అనే పదం జ్ఞానం, శక్తి మొదలైన గుణాలతో కూడిన బ్రహ్మాన్ని, "తవమ్" అనే పదం శ్వేతకేతువును శరీరంగా కల బ్రాహ్మణుని, ప్రథమ విభక్తి ఈ ఇద్దరి ఐక్యాన్ని తెలుపుతున్నది. ఈ విధంగా రెండు పదాలు ఒకే అర్థంలో అన్వయించినట్లయితే దానికి సామానాధికరణ్యం అని పేరు. "భిన్నప్రవృత్తినిమిత్తానాం ఏకస్మిన్ అర్థే వృత్తిః సామానాధికరణ్యమ్" అనే లక్షణవాక్యాన్ని ఇక్కడ గమనించాలి.

"శుక్లా శోభనాక్షీ పూర్ణశృంగా గౌః, తామానయ" (తెల్లని రంగును కల. అందమైన కన్నులను కల, నిండయిన కొమ్ములను కల గోవు ఉన్నది, దాన్ని తీసుకుని రా) అనే వాక్యాన్ని ఉదాహరణంగా ఇక్కడ గమనిద్దాం. ఈ వాక్యంలో ఉండే "తామ్" అనే తత్ శబ్దం ఆ వాక్యంలో ముందు చెప్పబడిన తెల్లని రంగును, అందమైన కన్నులను, నిండయిన కొమ్ములను కలిగిన గోవును సూచిస్తుంది – అనే విషయాన్ని గమనిస్తున్నాముకదా.

ఆ విధంగానే ఇక్కడ కూడా "తత్" అనే పదానికి ముందు బ్రహ్మానికి తగిన గొప్ప, పలు వైలక్షణ్యాలను తెలిపే అనేక వాక్యాలను మనం ఉపనిషత్తులో గమనించవచ్చు. గ్రంథవిస్తృతికి భయపడి సూక్ష్మంగా కొన్నిటిని మాత్రం గమనిద్దాం. "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్" అనే మొదటి వాక్యంలోనే ముందు తెలిపినట్లుగా, బ్రహ్మానికి జ్ఞానం, శక్తి మొదలైన గుణాలు, బ్రహ్మం కంటే విలక్షణమైన వస్తువులైన చేతనాచేతనాలు ఉన్నాయి – అనే విషయాన్ని, ఆ బ్రహ్మమే ఈ ప్రపంచానికి, కుండకు మట్టి, కుమ్మరివలె ఉపాదాన కారణంగా, నిమిత్తకారణంగా అవుతున్నది – అనే విషయాన్ని గమనించాముకదా.

అంతేకాక, ఈ "తత్త్వమసి" అనే వాక్యంతో చేరిన "ఐతదాత్మ్యమిదం సర్వం , తత్సత్యం, స ఆత్మా" అనే వాక్యం కూడా ఇక్కడ తప్పక గమనించదగినది. ఈ వాక్యం "ఈ ప్రపంచం బ్రహ్మాన్ని ఆత్మగా కలిగినది, అది నిజం, బ్రహ్మం ఆత్మ" అనే అర్థాన్ని ఇస్తుంది. వీటిని మనం మనసులో పెట్టుకొని నిశితంగా గమనిస్తే, "బ్రహ్మం ఈ ప్రపంచానికి ఉపాదాన కారణం, నిమిత్త కారణం అవుతున్నది. జ్ఞానం, శక్తి మొదలైన కళ్యాణ గుణాలను కలిగినది అన్ని వస్తువులను ఏ స్థితిలో అయినా ధరించి, నియమించి, అవి చేసే కార్యాలను స్వీకరించి, ఆనందించడానికి తగిన ఉన్నతమైన వస్తువై ఉన్నది" అనే విషయం చక్కగా తెలుస్తున్నది కదా. వీటివల్ల ఇక్కడ ఉండే "తత్" అనే పదం జ్ఞానం, శక్తి మొదలైన గుణాలతో కూడిన, కారణం వస్తువైన భగవానుని తెలుపుతున్నది – అని అర్థాన్ని నిర్వహించడం చాలా యుక్తం కదా.

ఇక్కడ ఉండే "త్వమ్" అనే పదం “శరీరాన్ని తెలిపే పదం. ఇది శరీరిపర్యంతంగా అన్వయిస్తుంది" అనే క్రమంలో శ్వేతకేతువు శరీరంగా కలిగిన పరమాత్మవరకు బోధిస్తుంది. దేవదత్తుడు అనే పదం మొదట దేవత్తుని శరీరాన్ని తెలిపి, అంతటితో నిలువకుండా, దానిని ధరించి, నియమించి, అది చేసే పనిని స్వీరించి ఆనందించే జీవునివరకు బోధించే రీతిని మనం లోకంలో చూస్తున్నాము కదా. జీవుడు పరమాత్మకు శరీరం అనే విషయం "ఐతదాత్మ్యమిదం సర్వమ్" అనే ఈ సందర్భంలో ఉండే వాక్యంద్వారా , "యస్యాత్మా శరీరమ్" అనే ఇంకొక వాక్యం ద్వారా మనం చక్కగా తెలుసుకున్నాము. ఈ విధంగా ఇక్కడ "తత్, త్వమ్" అనే పదాలు రెండు భగవానుడనే ఒక పదంలో అన్వయించడంవల్ల చూచి ఇక్కడ సామానాధికరణాన్ని మన పెద్దలు నిర్వహించారు.

ఈ విధంగా చెప్పినదానివల్ల చాందోగ్యంలోని సద్విద్యా ప్రకరణంలో (సత్ అనే పదంతో బ్రహ్మాన్ని తెలిపి, ఉపదేశం చేసే ప్రకరణంలో) బ్రహ్మం చేతనాచేతనాలతో, కళ్యాణ గుణాలతో కూడినదిగా, అంటే, విశిష్టంగా ఉన్నది – అనే విషయాన్ని, బ్రహ్మం – ప్రపంచం అనే వీటి మధ్య శరీరాత్మభావం ఉన్నది – అనే విషయం సంగ్రహంగా గమనించవచ్చు. గుణాలతోను, చేతనాచేతనాలతోను కూడిన పరమాత్మ నారాయణుడే గనుక, అతడే ఉన్నతమైన తత్వం అనే విషయం కూడా ఇక్కడ స్పష్టమవుతుంది. ఈ నారాయణుడు ఉత్తమ పురుషుడని, పరం జ్యోతిస్సు అని చెప్పబడుతున్నాడు. ఈ పరమాత్మను జీవుడు పరమాత్మ అనుగ్రహంతో చేరి, తన దాస్యస్వభావానికి తగినట్లు అనుభవాన్ని, కైంకర్యాన్ని చేసి ఉజ్జీవిస్తున్నాడు. ఈ ఉజ్జీవనమే మోక్షం – అని ఈ ఉపనిషత్తు వేరొక ప్రకరణంలో తెలిపింది. "ఏష సంప్రసాదః అస్మాత్ శరీరాత్ సముత్థాయ, పరంజ్యోతిరుపసంపద్య, స్వేన రూపేణాభినిష్పద్యతే, స ఉత్తమః పురుషః ,తత్ర పర్యేతి" (ఈ జీవుడు ఈశరీరంనుండి వెలువడి, పరంజ్యోతిస్సు అనబడే పరమాత్మను చేరి, తన సహజమైన రూపాన్ని పొందుతున్నాడు. ఆ పరమాత్మ ఉత్తమ పురుషుడు. ముక్తజీవుడు అతని సామీప్యాన్ని పొందుతున్నాడు) అనే వాక్యాన్ని గమనించవచ్చు. ఈ విధంగా చాందోగ్యంలోని అర్థం సంగ్రహంగా తెలుపబడింది.

# దివ్యప్రబంధ వైభవం

**(ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అష్ఠహ శింగరాచార్య స్వామి)**

**దృష్టం సూరివరైః శఠారికలిహశ్రీభట్టనాథాదిభిః**
**శ్రీశానుగ్రహలబ్ధదివ్యవిశదజ్ఞానైః కృపామూర్తిభిః,**
**శ్రీనారాయణవైభవస్తుతిపరం సర్వార్థికల్పద్రుమం**
**సేవేహం ద్రవిడాగమం సకలసంసేవ్యం సదా భక్తితః (1)**

శ్రీమన్నారాయణుని అనుగ్రహం వల్ల దివ్యమైన, విశదమైన జ్ఞానాన్ని పొందినవారు, దయ మూర్తీభవించినవారు అయిన నమ్మాళ్వారులు, తిరుమంగై ఆళ్వారులు, పెరియాళ్వారులు మొదలైన దివ్య సూరులు దర్శించిన ద్రవిడవేదం శ్రీమన్నారాయణుని వైభవాన్ని కీర్తిస్తున్నది. అది అన్ని విధాలైన మనో రథాలను తీర్చడంలో కల్పవృక్షంవంటిది. అందరూ సేవించ దగినది. అటువంటి ఆ ద్రవిడవేదాన్ని భక్తితో కీర్తిస్తున్నాను.

**శ్రుతిస్మృతిపురాణాదిదివ్యసూర్యుక్తిమూలకః,**
**జయతూభయవేదాంతసంప్రదాయ స్సనాతనః,**
**జయత్వమృతధారేయం సదాచార్యపరంపరా,**
**సంసారసర్పసందష్టా సంజీవ్యంతే యయా సదా (2)**

వేదాలు, స్మృతులు, పురాణలు మొదలైనవానిని, ఆళ్వారుల దివ్య ప్రబంధాలను ఆధారంగా కలిగిన ఉభయ-వేదాంత సంప్రదాయం సనాతనమైనది. అది వర్ధిల్లాలి. పూర్వాచార్యుల పరంపర ఒక అమృతధార వంటిది. అది

సంసారమనే సర్పం కాటు వేసిన సంసారులను ఉజ్జీవింపజేస్తుంది. ఇటువంటి ఈ ఆచార్య పరంపర వర్ధిల్లాలి.

**శ్రీరామానుజసిద్ధాంతో జగత్కల్యాణకారకః,**
**జయతాత్ జయతాన్నిత్యం లోకే పరమవైదికః (3)**

లోకానికి అంతటికి మంచిని కలిగించే భగవద్రామానుజుల సిద్ధాంతం వేదాలను మూలంగా కలిగినది. అటువంటి ఆ సిద్ధాంతం సదా వర్ధిల్లాలి.

**నాథోపజ్ఞే విభాగే ద్రమిడనిగమవాక్సంహతేః దృశ్యతే తత్–**
**సామ్యం రాజ్ఞా మనూనాం మనుమణిచరమాభ్యాం చ తాత్పర్యవృత్త్యా,**
**ఏతత్సామ్యం గురూణాం వివృతిషు విశదం దివ్యసూరి-ప్రబంధో**
**క్తీనాం సమ్యక్ సమింధే తదిహ సవినయం లిఖ్యతే సంగ్రహేణ (4)**

ఆళ్వారుల దివ్య ప్రబంధాలను నాథమునులు నాలుగు భాగాలుగా సంకలనం చేశారు. ఒక్కొక్క భాగంలోనూ ఆయా ప్రబంధాలలోని ప్రమేయాన్ని దృష్టిలో ఉంచుకొని వాటిని ఒక క్రమపద్ధతిలో కూర్చారు.ఆ కూర్పు తిరుమంత్రం, ద్వయం చరమ శ్లోకం అనే ఈ మూడు మంత్రాల తాత్పర్యం ఆధారంగా చేసుకొని చేయబడింది. ఈ విషయం ఆచార్యుల దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో గోచరిస్తుంది. ఈ అంశం ప్రస్తుతం సంగ్రహంగా నివేదింపబడుతున్నది.

దివ్యసూరులు అనబడే ఆళ్వారులు పన్నెండుమంది. వీరు అనుగ్రహించిన ద్రావిడ ప్రబంధాలు భక్తిసంప్రదాయానికి కరదీపికలు. ఈ ప్రబంధాలలోని  పాశురాల సంఖ్య సుమారు నాలుగు వేలు అయినందున ఇవి నాలాయిర దివ్యప్రబంధం అనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి. ఆయిరం అంటే వేయి. దివ్యమంటే  అలౌకికమైన అని అర్థం. శ్రీమన్నారాయణుని దివ్యమైన స్వరూపరూపగుణ విభూతిలీలాదులను ప్రతిపాదిస్తున్నందున వీటికి దివ్య ప్రబంధాలు అనే పేరు కలిగింది. ఇవి మొత్తం 24 ప్రబంధాలు. ఈ ప్రబంధాలద్వారా నాలుగు వేదాలలోని తత్త్వాలను ఆళ్వారులు ద్రావిడ భాషలో వ్యక్తం చేసినందున ద్రావిడవేదం అనే  పేరు కూడా వీటికి ప్రసిద్ధి చెందింది.

నాలాయిర దివ్యప్రబంధం ముదలాయిరమ్, పెరియ తిరుమొళ్ళి, ఇయఱ్పా, తిరువాయ్ మొళ్ళి – అనే నాలుగు విభాగాలను కలిగినది. ఈ విభాగాన్ని శ్రీనాథమునులు చేశారు. ఈ విధంగా ఈ విధంగా ఆళ్వారుల ప్రబంధాలను నాలుగు విభాగాలుగా శ్రీమన్నాథమునులు చేయడంలోని తాత్పర్యాన్ని గమనించిన మన పూర్వాచార్యులు వీటిని ప్రణవార్థరూపాలుగా, వేదార్థ ప్రతిపాదకాలుగా,  రహస్యత్రయార్థ వివరణరూపాలుగా వివరించారు.

**నాలాయిర దివ్య ప్రబంధాల  ప్రణవార్థవివరణం, వాటి వేదసామ్యం**: ముదలాయిరమ్  అనే మొదటి వేయిలోని మొదటి ప్రబంధం తిరుప్పల్లాండు. ఈ ప్రబంధం ప్రణవార్థాన్ని వివరిస్తున్నది. ఈ విషయాన్ని శ్రీవరవరమునులు ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలో "కోదిలవా మాళ్వార్ కళ్ కూఱుకలైక్కెల్లామ్ ఆది తిరుప్పల్లాణ్డానదువుమ్, వేదత్తుక్కు ఓమెన్నుమదుపోల్ ఉళ్ళదుక్కెల్లామ్ శురుక్కాయ్ తాన్

మంగళమాదలాల్" (ఏ దోషం లేని ఆళ్వారుల సూక్తులకు అన్నిటికీ ప్రారంభం తిరుప్పల్లాండు కావడం ఎందుకంటే–వేదాల్లోని అర్థం అంతా ఓంకారం అనే ప్రణవంలో ఇమిడి ఉన్నట్లే దివ్య ప్రబంధాల అర్థం అంతా తిరుప్పల్లాండులో ఇమిడి ఉన్నది కనుక, మంగళరూపమైనది కనుక) అని తెలియజేశారు. ఈ సూక్తిని వివరిస్తూ పిళ్లై లోకమ్ జీయర్ " ప్రణవాన్ని ఆరంభంలో కలిగిన తిరు మంత్రం ప్రాప్యమైన భగవత్కైంకర్యాన్ని ప్రధానంగా ప్రతిపాదిస్తున్న ట్లే, ఈ ప్రబంధంకూడా భగవానుని మంగళాశాసనరూపమైన కైంకర్యాన్ని ప్రతిపాదిస్తున్నది" అని అన్నారు. శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుప్పడి గ్రంథంలో – అష్టాక్షరిలోని మూడు పదాలలో మొదటి పదమైన ఓంకారాన్ని మిగిలిన 2 పదాలు వివరిస్తున్నాయి, అంటే, ఓంకారాన్ని నమః, నారాయణాయ – అనే రెండు పదాలు వివరిస్తున్నవి – అని తెలియజేశారు. దీనివల్ల వేదమంతా ప్రణవవివరణం అయినట్లే,మిగిలిన దివ్య ప్రబంధాలు అన్నీ కూడా తిరుప్పల్లాండు ప్రబంధాన్ని వివరిస్తున్నాయి – అని ఏర్పడుతున్నది. దీనివల్ల దివ్యప్రబంధాల వేదసామ్యం స్ఫురిస్తున్నది. ఇంతేకాక, తిరుప్పల్లాండు ప్రబంధం ప్రణవార్థాన్ని వివరిస్తున్నది కనుక, మిగిలిన దివ్యప్రబంధాలు తిరుప్పల్లాండుకు వివరణరూపాలే కనుక, ఆళ్వారుల ప్రబంధాలన్నీ ప్రణవార్థ వివరణరూపాలని తెలుస్తున్నది.

వేరొక రీతిలోకూడా ఆళ్వారుల ప్రబంధాల వేద సామ్యం సిద్ధిస్తుంది. ఆళ్వారులు అందరిలో నమ్మాళ్వారులు ప్రధానులు. ఆవిధంగానే, ఆళ్వారుల ప్రబంధాలు అన్నిటిలో నమ్మాళ్వార్ ప్రబంధాలు నాలుగు అంగి ప్రబంధాలుగా చెప్పబడుతున్నాయి. తిరువిరుత్తం, తిరువాశిరియమ్, పెరియ తిరువందాది, తిరువాయ్ మొழி – అనే ఈ నాలుగు ప్రబంధాలు నాలుగు వేదాల సారమని

